# జలదాంగన

(పద్యకావ్యము)





కవికోకిల

దువ్వూరి రామిరెడ్డి

కవికోకిల గ్రంథమాల

పెమ్మారెడ్డిపాళెం — ఎల్లాయపాళెం (P O)

నెల్లూరు జిల్లా



# జలదాంగన



నీలవునీరునఁ బండి రాణించుచున్న
పైఱుపొలముల విహరించు పాటలశ్మి
యొఱపుఁబయ్యెద బంగారు మెఱపులనెగు
సంజనిగ్గుల వరిమళ్ళ చాయలాలికే!

పొలముల కాలకేఁపుటకఁ బొద్దుసనేఁగిన కాఁపుబిడ్డ లా
వ్రుల పదధూళిసోఁక నెడవోయెదు దూడ లదల్చికొంచు నిం
పుఱు చికలించు వేణురవము ల్వలికించుచు గూళ్ళఁజేరు ప
క్షులకును మున్నెయూరిదెసకు న్మరలించిరి యాలమందలన్

గగనసీమంతినీ కంఠ గళితమైన
మల్లె పూదండ ఱేకులు దుల్లెననఁగఁ
బైనఁ జరియించు కొంగల బారు లెంతో
యలరు చుండెను దర్శనీయంబులగుచు

# జలదాంగన

ప్రకృతి యెల్లను శాంతమై పరఁగుచుండ
శాలి కేదారములలోనఁ జలగాలి
నల్ల నల్లన విహరింప నుల్లమందు
నంతులేని యానందంబు నందుచుంటి

కనుఁగొనుచుండఁగా జలదకాంతల కుచ్చెలకోక చెంగలం
దనరు జపాసమార్ద్రరుచి దగ్గను, దిక్కుల నుప్పతిల్లె నం
తనె యిరు, లక్కడక్కడను దారకలుం గనుపట్టె మిక్కుమం
చనయము మిణుఁగుఱుంబురువు లాడుచునుండెను జేఁగట్లులన్

గగన రత్నాకరంబు నాగ్రహమునొంది
కాలమనెడు నగస్త్యర్షి, కమలబాంధ
వాంశునీరమ్ము గ్రోలిన నచటఁ దోఁచు
రత్నములనంగ నక్షత్రరాజి మెఱయు.

అంత సుధాంశుబింబము వియత్తలమం దుదయించె నా రతీ
కాంతుఁడు యామినీరమను గాంచుటకుం జను వేళ మల్లెపూ
బంతి శతాంగముం జలదబాటఁ జకోరపు వారువాలచే
వింతగఁ బూన్చెనా మొయిలుపిండిహిమంబుగ రేఁగునట్లుగన్

# జలదాంగన

గగన స్రవంతికా కల్లోలడిండీర
ఖండంబు లభ్రమ్ము గప్పెననఁగ,
నందన కల్పద్రు సందోహములు పూచి
యెల్లెడఁ బుప్పొడి చల్లెననఁగ,
ప్రాగద్రి శిఖర ఘుసృణమునం దొలివడి
యుడుభర్త యమృతంబు నొలికెననఁగ,
ఉన్మత్త కరిదంత దీప్తులాకాశ ద
ర్పణమున బింబించి వఱలెననఁగ,

శర్వరీ మందిరాంతర స్థంబులైన
హీరమణి దీపముల కాంతి సారమనఁగ
మెత్తఁదనమును శైత్యమ్ము మిళితమైన
పండువెన్నెల నల్గడ నిండుకొనియె!

వెన్నెలఁజూడ నందమగు వేసముదాలిచి కొండనెత్తమం
దున్న పయోదమొండు పవనోపహతిన్ మెలమెల్లనూఁగుచున్
సన్నని యంబరంబటులఁ జందురుఁగప్పుచు వీఁగిపోవు చె
న్నన్నొ మనోహరాకృతుల నెత్తుచుఁ గన్నులఁగట్టె వింతగన్.

## జలదాంగన

చూడనుజూడ నందమగు సుందరి రూపుధరించి, వేణి రా
పాడు జరీముసుంగు హరిణాంకు కళన్మ్రిసలాడఁ గాంతునిం
గూడి నభో విహారవన కుంజతలంబుల సంచరించు పె
న్వేడుక రోహిణీ రమణి వే యురుదెంచెననంగఁదోఁచినన్

జలదకాంతను గాంచి యాశ్చర్యమొంది
కన్నువాల్చక నందమ్ము గనుచునుండఁ
గవి కుమారుఁడ నౌటఁ దత్క్షణమె నేను
భావమున నబ్ద సారూప్యపదవిఁబొంది

చెలియ! యథేష్టరూపములఁ జిత్రగతిం జరియించె దీవు, నీ
చెలువముగాంచ మ్రోడయినచిత్తముగూడఁజిగిర్చు, నేలొకో
వలిపపు మేన్ముసుంగునిడి వచ్చితివొంటిగ, వానమెద్ది, యెం
దుల విహరింపఁబోయెదవు, తుందుడుకొందక నిల్చి తెల్పుమా!

నిన్నుఁగనుఁగొన్నదాదిగ నీదు చరితఁ
దెలిసికొనఁ గౌతుకంబు చిప్పిలెడి నబల,
యెవరిదానవో? తలిదండ్రు లెవరొ గాని
ఘనుల సంతతిగా నీవుగానఁబడెదు!

# జలదాంగన

అనవిని కాంత యిట్లనియె నంత మదీయచరిత్ర మింతయున్
వినుచు విషాదమోదముల విచ్చినచిత్తముతోడ దైవసృ
ష్టిని దలపోసి యబ్బురముఁజెంద నభీప్సితమేని నాకథన్
వినుము కవీశ్వరా, ప్రణయవిస్మయముల్ తలపుఁ హారి పగన్

నీవె ఊహింగని వింతలు నిమనంబు
చొచ్చు శక్యంబుగాని దెచ్చోటఁగలము?
ఐన నానోటఁజెప్పింప నాసయేని
వినుము పుట్టుపూర్వోత్తరంబును కవీశ!

జలజభవుండు సూర్యుఁడు నిశాకరుఁ డుర్వియు, దారకల్దిశల్
కులగిరు, లివ్వియివ్వి యనుకోఁబనియేల? సమస్తమున్
సలుపకమున్న నాదు సరసంబగు పూర్వపు రూపానర్చె న
న్న లవము నాత్మసంస్తుతి యనంజనరెమ్మెయిఁ దత్వదర్శనుల్!

జంట పిసుంగులట్లు నను సంతసుసమ్మునుగాంచి మాయవా
ల్గంట యదృశ్యగాఁగఁ గడగండ్లనుసైపుచుఁ దల్లిలేని మా
చంటి తనమ్ము పుచ్చ, నిమిషమ్మును వీడనిమమ్ముఁబాప మా
యింటనుగాని గోళములు హెచ్చెను లెక్కకు మిక్కుటంబుగన్

అనుజను గోలుపోయి మదియుం డెడవోని వినియోగ వేదనన్
వనరుచునుండఁ బృథ్వియను బాలయొకర్తుక చేరవచ్చి న
న్ననునయ వాక్యముల్పలికి, యార్తియొకింత శమింపఁ జేసినా
మనమున కెక్కుడాస్యమున మాగృహమందె వసించియుండినన్,

కాలుఁ డనియెడు సుందరాకారుఁ డొకఁడు
మమ్ము నిరువుర నీక్షించి మానసంబు
ప్రణయముగ్ధంబుగా వచ్చి వలపుదెలిపి
పరిణయంబాడె సౌఖ్యసంపదలు పొదల

కొన్నిదినాలు ముప్పురముఁగోరికలీరికలెత్త, సౌఖ్య సం
పన్నతఁ గాఁపురంబు సలుపన్ ఫలియించెను నాదుగర్భ, మా
పన్నతనొంది పృథ్వి మదిఁ బాటిలునీసున నాసుఖంబు సైఁ
పన్నరింతలేక చలపట్టి గృహంబునఁ బోరు వెట్టుచున్

ఆక్రమించెను నావాసమందుఁ గొంత
స్థలము, 'నదియేమె' యన్న 'నీసవతిఁగానె
హక్కు లేదఁటె? నాకింట' ననియెఁ బృథివి,
చేరదీసిన ఫలితంబు సిద్ధమయ్యె!

ఇది పతిచనవని గనుఁగొని
తుద కేమియుఁ జేయ లేక దుఃఖముపాలై
కుదురెఱుఁగక తొందరపడ
నొదవెను నీఫలమటంచు నూరకయుంట౯

అంతటఁ గొన్నేండ్లకు నా
కాంతకు సంతానవృద్ధి గలిగెను నైనం
బంతంబు విడదు న సయి
నంతింతకు లేని తగవులాడుచు నుండు౯

సవతులకు గిల్లు జగడాలు సహజమైన
బిడ్డలైనను నా డొఱు ప్రీతిమెయి ,
నొఱవు పొరపొచ్చములు లేక యుందురన్న
నదియు నొనఁగూడదాయె నీర్ష్యాళులగుట

అనుదులకు న్నిలింపులకు నయ్యెడు తియ్యని పోరులట్ల వె
క్కసముగమాయపత్యములు కయ్యములాడుచునుండఁబ్రుద్ధి
యుం గసిగొనిమందమేలమునఁగాంతుని చిత్తము మ్రిచ్చిలించి
యుం పెసంగెడు బుద్ధి నాత్మజులకీ నొనరించె రహస్యరీతిగ౯

పైతృకంబగు "బుద్ధి" సంపదనుబడసి
విఱ్ఱవీగుచు మమ్ముల వెతలుగుడుప
నెన్నొ సాధనములఁబన్ని యెట్టయెడకు
నాదు సంతతిఁబట్టి తినంగనైరి

అంతంబోక మదీయగర్భగుహ గోప్యంబౌనటుల్ చేర్చినే[ముల్
నెంతో మక్కువ దాచియున్నమణులన్ హీరంబులున్ ముత్య
కాంతింజిల్కు ప్రవాళవల్లులు బలాత్కారంబుగా నాచికో
శాంతింజెందునె నామనంబెటులనోసైరించుకోఁబోయినన్?

తనరె బలంబటంచు విదిధర్మ మధర్మ మనాక కార్యముల్
పొనరుచు పృథ్విసంతతుల పోతరముంగని యింతగర్వముం
డినఁగొనసాఁగుటే కడకు డెప్పర మౌనని యెంచికొందు, నం
తనె శివ మేల? యెప్పుడయినం దుదిదాక వె దుష్టకల్పనల్?

తమకు బలంబు శౌర్యమును ధైర్యమునిచ్చి సమస్తసౌఖ్యముల్
క్రమముగఁగూర్చి వెరవికరంబు పదానతమా సమీకమా
గ్రము గనిపెంచుబుద్ధి ముదర వ్యాపమించి నిజాశ్రయంబుగా
ల్ప మొదలువెట్టెఁ, బరిపాటికి మించిన నిశ్లైయమాఁ గదా!

ప్రకృతిశాస్త్రంబు విద్యయు భవ్యకళలు
శావసంపూర్ణతకుఁ దోడుపడుటమాని
ప్రజల నాశనమందె పర్యాప్తమగుట
దాపురంబయ్యెఁ బుడమికిఁ బాపఫలము

నాతలుచేసి, నాహృదయ నాళములెల్లను జుంజురౌనటుల్
త్రోవలుదీసి, యాత్మకడఁద్రోసి, శరీరసుఖంబెగోరి యీ
న్యావిలచిత్తులై తుదకు నందఱు భోగము కారణంబుగం
గావలమెత్తిపోరిరి వకావకలై తమతల్లి బెగ్గిలన్

గారవించిన నాగరికంబు కడకు
ధూమ ఫూత్కారములలోనఁ దూలిపోయె
మనుజసంతాన మాహావ మత్సరమునఁ
గంతదళనా వినోదంబు గడపు నహహా!

నన్నుఁ బెట్టిన కష్టంబులన్ని సవతి
పొందుచున్నది పుత్రిల మూలమునను,
కన్నబిడ్డల నెత్తుటి కాల్వలందు
నీఁగుచున్నది పృథ్వి హించి యెటులో!

కోరుచుండిన తరుణంబు గూడికొంట
సవతి పుత్త్రుల రక్తంబు చవులుపుట్టఁ
దనివి దీఱఁగ నేను సంతానములును
దాఁవివారము క్షీరపూరంబు లటుల!

మాటకుమాటవచ్చి చనుమానముతో నిటులంటిఁగాని నా
కేటికి మున్నమున్న శమియించిన గాథలు ద్రవ్వికోఁగ, నా
పాటికి నంతరాళమునఁ బర్యటనం బొనరించి పిన్నబి
డ్డాటల నడికొందుఁ బవనార్భకుఁడర్మిలినన్నుఁగూడఁగన్,

అనవిని పల్కితి జలదాం
గన, యిట్టిసురూపమెటుల ఘటితంబయ్యెన్?
మునువున్న వనధిరూపం
బును నెట్టుల మార్చితివి అపూర్వప్రరీతిన్?

తెలుపుమటన్న, నౌనవును, దెల్పుటకు న్విషయాంతరంబు వ
ర్తిలుటయు నెట్టులోమఱచితిన్, వినిపింతును శేష,మిద్ధరన్
గలుములు లేము లెప్పుడు వికారము లొందక యొకరీతి ని
శ్చలముగ నుండఁబోవనెడు సామెత సీ కెఱుఁగంగ రానిదే?

కొన్ని దినములు చీఁకటి కొన్ని నాళ్ళు
వెన్నెలనియెడు లోకోక్తి విదితమయ్యె,
నాకు మనసీక వర్తించు నాహృదీశుఁ
డెలమి వశవర్తియయి నన్నె వలచియుండ,

ఒకనాఁడిద్దఱ మిష్టగోష్ఠిఁ బ్రణయం బుప్పొంగి లోకంబుదోఁ
పక సౌఖ్యంబులఁ దేలియాడి కడకున్ భావంబుశాంతింప నా
యకలంకంబగు పారవశ్యమును నెయ్యం బారవర్ణించి మా
మక సౌందర్యరసాబ్ధి నీఁదుచు వచోమాధుర్య మేపారఁగన్,

కాంతుఁడు ముద్దుచెక్కిళులు కమ్మనినవ్వు ముసుంగులోన సం
తి త రాని నౌరు రచియింపఁగ నింపగురీతిఁ బల్కె 'నో
కాంత క్షమింపు మున్ను నినుఁగన్నులఁ గప్పికొనంగ లేక య
త్యతి ముపేక్షతో మనముదాఁచిన నావిరసంపుఁజైదముల్!

'వెడలె గ్రహచార వేళయుఁ' బృథివియన్న
నివ యన్నను వేఱేమి నీరజాక్షి
మునుపు సలిపిన యపరాధములను మఱచి
నన్ను నీదాసునిగ నేలు మున్న వినవె?

‘కలదు రహస్యమొంగు,కినుక న్వహియింపకు మోసమంచు నేఁ
చెప్పక యూరకుంటిఁ బోలఁతీ! గతమెప్పటికిన్ గతంబె, యం
దులకు విచారమేల? ననుదుష్టుఁడ నంచు దిరస్కరించి నం
జెలిమి నెజింగి దగ్గరకుఁ జేర్చన నియ్యావె పాపపుణ్యముల్?’

అని మగవారికిం దెలుప నళ్కుజనించెడు నెన్నోతియ్యముల్
మనము గరంగఁబల్కె నను మన్ననవేడి, యనంతరంబు జం
కును గపటపరిచారమునకు న్వాడనవ్వును సిగ్గుదోఁప ని
ట్లనియెఁ బ్రియుండు నాతలఁపులాకుల పాటున సంచలింపగన్

వనితా! యేమని చెప్పవాఁడఁ? బరిణయవ్యామోహచిత్తుండనై
నను గాలుఁడను పేరఁ జేరితిని నే నీరేజబంధుండఁ బ
చ్చని గుఱ్ఱంబుల తేరిపై గగనసంచారంబు గావించుచుం
దును, నారూపమెఱుఁగఁగోరికయినం దోడ్తోన వీక్షింపుమీ,

అని వచియించి, కాంచనశతాంగము హీరకిరీటమొప్ప మో
హన రవకాంతులీనెడు సహస్రకరంబులతోడ వెల్గుచున్
గనులకు వెక్కసంబగుచుఁ గానఁబడం దలయెత్తిచూడలే
క నిలిచియుంటి నూరక వికారము నొందని జాతిబొమ్మగన్

అంత నిజస్వరూపము దయామయుఁడై కుదియించి సూర్యుడం
'గాంత' ప్రభాతకాలమునఁ గాంచనచేలము దాల్చి నామనం
బెంతయు మ్రుచ్చిలించితివి యింక నినువ్వీడనాడఁజాల, నా
చెంతనె సర్వసౌఖ్యములు చేకుఱఁ గాఁపురముండుమీ' యనన్

కలలోఁదోఁచెడు వింతమార్పులటులం గాలంబునందోఁచె నీ
జలజాతాప్తుని బ్రత్యహంబుఁ గనుదున్ సంతోషమేపార నీ
చెలువంబుం గమనీయమూర్తియును నే సేవింపలేదింత కొ
చ్చెల! నాభాగ్యము పండెఁగావలయు నీచిత్రంబు సంధిల్లుటన్

ఒక్కనిమిషంబులోన నాయుల్లమపుడు
పూలతేఁకుల రెక్కలఁబూని యెగిరె
స్వర్గపవనంబు వీచు నావరణమునకు
నౌర! రూపాంతరం బెత్తినట్టు లయ్యె

అభ్రసంచారియౌ మోహనార్కుఁడేడ?
క్రింద ఘోషించు నేనేడ? క్రీడయేడ?
అందరాని ఫలంబుల కాసచేయు
నట్లు ప్రణయ పర్యవసాన మౌనో యేమొ?

అని తలపోసికొంత, పరిణయంబు ముదంబు విషాదముఁ బూనం
బునఁ బెనఁగొన్నలోనణఁగఁబుచ్చి హృదీశునిగాంచి కాంత యి
ట్లనియె, మనోహరా, గగనమందుఁ జరించెదు మీకు నాకు నె
ట్టనువగుఁ గాఁపురంబు మనుపట్టు లెవ్వ త్రము భావికాలముఁ

అయిన ననుకొందు, మీదు పాదాంబుజముల
రజములకు నైన సరిపోఁ దరమ్మె నాకు?
అట్టి నన్నును వలచి రూపాంతరంబుఁ
బూను టెంతయు నాపూర్వ పుణ్యమే మొ!

అనవిని సూర్యుఁడిట్లనె
మనమున నెల్లెంతో నీవుమానిని, నీ రూ
పును గాంచ దివ్యసుందర
తనువటు గన్పట్టు నాకుఁ, దధ్యంబిదియుఁ

శీకరమౌక్తికంబుల రచించిన కంకణపాళి మాలిక వీ
చీకరముల్ మనోహరపుఁ జిట్టకముల్ పచరింపఁ జాఁపి సం
ధ్యాకమనీయ వేళల ముదంబున నం గవుఁగింటఁ జేర్చు నీ
నాకతము న్మదిందలఁప స్వర్గసుఖమ్ము సధఃకరింపదే?

అభ్రి సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తఁ
జేసెదను రమ్ము నాతోడఁ జెలువమిస్త
లోక మెల్లను నీయాజ్ఞ లొంగియుండ
నేలెదవుగాక సస్యవిశాలధాత్రి!

అని కరముల్ సహస్రమును నల్లఁ జాఁచి ప్రవాహదశాప్లవిం
దు నికరముల్ దొరఁగ నవతోయజముగ్ధుఁడు గాఁగిలింప, నే
ను వచియింతు బాష్పమయనై యుపగూహనమందె లీనమై
తిఁ తదనంతరంబు నను దేఁకువఁ జేర్చె నభోంతరాళముఁ

వలిగాలిం దనుతాపముం దొఱఁగి దివ్యంబైన యీరూప ము
జ్జ్వల శంపాభరణంబులుం గలుగ నే సంతోషముం బొంది ని
చ్చలు వాతార్భకతోడ నీతలములన్ సంచారముం జేయుచున్
మలనెత్తంబుఁ దీవటీ వరుల లోనం జేరి క్రీడించుదున్

సాంధ్యవేళల ఎడమటి చఱులయందుఁ
బొటమరించెడు నపరంజి పొడుపుకేటి
యందు నీరాడి, పెన్నెఱు లార్పుకొనుచు
వచ్చుచుందును గవుంభావంబు లలర!

పండువెన్నెల లలరు శర్వరుల యందు
వలిపపు ముసుంగు నోరగా వలనుపఱచి
వెన్నెల పులుంగు పిల్లల చిన్నినోళ్ళ
నమృతకణముఁ బూని తా నెయ్యంబు గురుర

ప్రొద్దువొడుపున విరియు క్రొంబువులయందుఁ
గాఁపురంబుండు నిందిర కంఠసీమ
మంచుతుంపర ముత్యాల మాలగట్టి
వైచుచుందును నానందవర్ధనముగ

ఆఝరిగంగాప్రవాహంబు నవల దాఁటి
గమ్రిమణుల సుకేశుండు గట్టినట్టి
యింద్రధనువను వంతెన నెక్కిపోదు
జలక మాడిన తెరగంటి చెలులతోడ

కనులకు నిచ్చ క్రొత్తలయి గానఁగవచ్చెడు వింతలెల్ల నేఁ
గనుచు నభోంతరాళమునఁ గాంతునితోడ వసించియుంటి నం
తన మఱికొన్నినాళ్ళకు నతర్కితరీతి నెఱుంగనయ్యె నా
యునికి యసాళిమోస, మిఁక నెంతయొనర్పఁగ నంగవింపఁడో!

పొద్దున శమ్యుఁగిడి చెలి పోయెదనంచు వచించి యేఁగుచో
నెద్దియొ సందియం బు మది హెచ్చ రహస్యపురీతి వెన్నడిన్
సద్దొనరింప కేఁగదుగఁ జల్లఁగఁబోయెను నంగి మెల్ల నిం
కెద్ది వచింతుఁనో కలుగనే కలిగెన్ సవతమ్మ నాకనున్!

నను నటు నమ్మఁబల్కి గగనంబులకుం గొని తెచ్చె, పూర్వపుం
దనుఁ దొలఁగంగఁజేసె, మమత న్ననుఁ జాయని పిన్నపాపలన్
నగ రొక్కయింతలేక విడనే విడివచ్చితి నింతకున్ ఫలం
బవఁగ సరోజినీసఖుని నగ్నిఁ బెడిలియుయ్యెఁ గ్రమ్మఁగన్!

అలరులబంతి యంట! తనువందిన కమ్మఁగి మోహమంట! సొం
పౌలుకు మిటారియంట! తనయుల్లమునం గలకొత్త వంటయం
ట! లలితచిత్ర యానంట గనంగన ముద్దులమూటయంట! యీ
పలుకులఁ గాంతుఁజేసవతిఁ బల్కఁగ నేవిధి యెట్లు నోర్వఁగన్?

కొదమ పిసాళి తుమ్మెదల గుంపు ఝుమ్మని పాటవాడ వా
యుదళిత చంచలోర్మికల యుయ్యెలనూఁగుచు జిల్గుమంచు ప
య్యెదవర హేమముదోఁపఁగపయిన్మనుగట్టులవైచి పద్మినీసుదతి
పరిమోదముం గొలుప సూర్యుఁడు నావలిపమ్ముదీయుచున్

## జలజాంగన

అలరులమిన్న, రమ్మని సహస్రకరంబులఁ గౌఁగలింప నా
జలజ లతాంగి యంగమున సన్ననిపుల్కలు నాఁటవోసిన
ట్లలరఁగ నింతమోము నిఁకసంతగ విచ్చి యొయారపుం దెఱం
గులఁ బతిచిత్తముం బడయ గోడడకి పదె నన్ను మిత్రమా!

కామినికి బ్రాణతుల్యుఁడౌ కాంతు డెవతో
యొకతె వలపింప ముగ్ధుఁడై యుల్లమిచ్చి
మొదటి కాంత నొప్పరికించి పోవు- తఁగు
గొంతుఁ గోయలేఁడే తడిగుడ్డఁ జుట్టి?

ఖరకరుండఁట! లోకంబుగాల్చునంట!
అట్టివానికిఁ జిత్త మింకెట్లు కోమ
లంబుగా నుండు? మోహవిలాస ముగ్ధ
నాటఁ గపటంబుఁ దెలిసికోనైతి నకట।

నన్నొక భోగకామిని యనం దలపోసి యభీష్టసిద్ధి యా
ట న్నను వీడనాడి కులట జ్జలజాంగనఁ గూడెనేమొ! యీ
తెన్ను నెఱుంగకుంటఁ గడ తేఱఁగ రాని సపత్నిమత్సరం
బెన్నుచు వంతలం గుడుచు చెట్టులో కాలమువుచ్చ నేర్పడెఁ

ఇది యిటులుండఁగానె మఱి యింకొకవార్త వినంగనయ్యె న
య్యది వినఁబుంట నుప్పిడినయట్టుఁల, గాల్చినసూది వీనులం
దదిమినరీతి నయ్యె నవురా! తరుణార్కుని దుండగంబు దా
నిదివఱ కొక్క ఛాయయను నింతిని నిల్లె యొనర్చెనంటకా!

అంతకంతకుఁ బతి యకృత్యములు హెచ్చఁ
జల్లనై చిన పాలునా జవి మనము
విఱుగ నాత్మహత్యయుఁ గొంత ప్రియమటంచు
నంత హిమగిరి కేఁగఁ బ్రయాణమైతి

అంచలబారు మానస సరోంబు విహారము గోరి పోవుచోఁ
గాంచి తటస్థమయ్యె విధికల్పన నర్హాపుదారితో డటం
చెంచి, యలంత లేక పథ మేడ్తెఱనాగ వచించు గాధ లూ
కొంచునె మంచుకొండ యెడకుం జనఁగల్గితి నాస పెంపునన్

అరరే! యేమని దెల్పుదాన సుకవీ యాకొండయందంబు! ని
బ్బరమై మంచౌలికించు తెమ్మెరలు వీవన్ దిక్కు లివ్వంచుఁజూ
పఱు లెన్నంగ నశక్యమౌట, నచటం బల్లంబులు న్మిట్టలుం
దరులుం గాల్వలులోయలంచుఁ దెలియనా ప్రొకండఁ జూపట్టెడిన్

అంబుధరగర్భములు చీల్చు చాకసమున
హిమధరాధర శృంగంబు లెఱిగి యెదిగి
కన్నులకు నందు మేరలకన్న దాఁటి
తారకామండలంబును దాఁకుచుండు.

తరువులెల్లఁ దుషారంబు దవిలిగడ్డ
గట్ట, నద్దంపుఁదునకల కళలు దేలి
మంచు ముసుఁగులఁ బచ్చ రాణించుచున్న
చివురుటాకు జొంపంబుఁ జెలువుగొలుపు,

శీతగిరి గాంచినంతనే చిత్తమందు
వెలుఁగుచున్న నమర్షకీలలు శమించెఁ,
జుట్టుపట్టుల నడయాడి చూతమంచుఁ
దరలితిని మంచుగడ్డ నెత్తమ్ములకును

అనవిని నేను బల్కితిని 'యంగన' నీదగు భాగ్య మేమి సె
ప్పను! గనుఁగొంటివే కనులపండువుగా హిమవద్ధరాధరం
బునఁగల వింతలన్నియుఁ? బ్రమోదము పుట్టెడి నీవు దెల్పఁగా
విని యిఁకజూచినం గలుగు వేడ్కలకుం బొలిమేరలున్న వే?

'ఏనును నీపరికారముగ నెక్కడికైనను నేఁగు రూపముం
బూన వలంతినైన హిమభూధరశృంగము లెక్కియాడమో
దానఁ జివుక్కుమం చెగిరి దాఁటనె! యంతటి నోము నోఁచు లే
దో నచులక్కటా! గఱుతో నొకపుడ్గ నైనబుట్టనే?

అనవిని యంబుదాంగనయు నౌనవు! నాగిరి యంద మాడకీ
వును జని చూడకున్న ననుబోఁటి వచించిన యంతమాత్రఁ దీ
ఱునె తమి, పుట్ట తేనియలు గ్రోలినవాఁడు రుచివ్వచింపఁ దీ
వును నెఱుఁగందరంబె యొకబొట్టయినం జవిచూడకుండినన్?[2]

అవుఁగాని యటుమీఁద, నాకొండ మంచుగ
డ్డలువ్రీలఁ బగుళుల నొలుకుచున్న
సెలయేళ్ళు వెండికమ్ముల లీలఁ జాల్కొన
నట కేఁగి చలినీళ్ళ యందు దోఁగి
బలువైన మంచుతుప్పలు గాలిఁ దూలిన
నోరగా నటునిటు నోసరిలుచుఁ,
గన్నులుగట్టియుం గట్టక మాయమా
కలయట్లు నెల్లెడఁ గలయఁదిరిగి

విష్ణుపాదాబ్జమునఁబుట్టి విన్నువాఁక
వెడలు గుహ కడ నొకకొంత వేచిచూచి
శంకరుని యెద్దుగిట్టల జాడఁబట్టి
గదలిపోతిఁ గైలాస శృంగంబు దరికి

ఎడకాల మంజీర మింపుగా రవళింప
గుడికాల బిరుదందె గులుకుచుండ
వలకేలఁ గంకణమ్ములు ఘల్లుమనిమ్రోయఁ
గడికేలఁ గాప పెందొడవు లలర,
వలరొమ్ముపయ్యెద వలపుగుబ్బలి నిక్కఁ
గుడిరొమ్ము బూది నిగ్గులఁ జెలంగ,
ఎడమకొప్పెవ్వెద దావులీను గేదఁగిపూవఁ
గుడితల నెలపువ్వు కొమరుచూప,

డక్కి చేనూని, మేనులు సొక్కి సోలఁ
బ్రమదగణములు నాడుచుఁ బాడుచుండఁ
బ్రకృతి యాత్మయు మిళితమౌపగిదిఁ దాండ
వించు నర్ధనారీశ్వరు వేడ్కఁగంటి!

అక్కడనుండి దేవతల యక్కఱదీర్పఁగ మన్మథుండు దా
నెక్కటి పూవువిల్లు గొని యిందుకళాధరు నొంపవచ్చినం
గక్కసమెత్తి నెన్నుదిటి కంటిసెకం గరఁగించినట్టి యా
ప్రక్కకుఁబోయి చూడనటఁ బట్టదు పచ్చని పూదియేనియున్

బదరికాశ్రమ వాసులౌ పరమమునుల
యజ్ఞవాటులు నేఁటికి నలరుచుండు
నెండ కెండి వానకు నాని యిప్పటికిని
నమరు నచ్చోట యూపకాండముల గములు

అటనుండి విధి వశమ్మునఁ
దటరుహా వల్లీ నికుంజ తతుల మనం బు
త్కట మోదంబునఁ దేల్చెడు
మటుపాయల కొలనుగాంచి మంజులమనుచున్

విమలజలములఁ గ్రుంకిడ వేడ్కగలుగ
మునిఁగితినొ లేదొ యంతలోఁ దనువునందుఁ
బులక శక్యంబుగాని పెంజలియు వణఁకు
గదిరి యటునిటుఁ గదలు లాఘవము దొలఁగ,

అక్కటా! మోసమంచు శోకార్త నగుచు
దిక్కుదెస లేనిదాననై సొక్కుచుండి
ప్రాణమేఁగిన మెయి కట్టెవాఱు నటుల
మంచుఱాయిగ నంతలో మారిపోతి!

అప్పటి వాయుదంత మిసుమైన నెఱుంగను, లేచి చూచుకో
న్నప్పుడు లేఁతసవ్వ లోలయఁ జలజాపుఁడు జేరవచ్చి న
న్నొప్పరికించినట్టి కొల యూరడగం బరిచర్య సల్పినం
దప్పటిమించమం చడుగఁ దగ్గఱ నిల్చియె యుండె దీనుఁడై

ఆతని నవ్వ్యాగాంచి హృదయంబునఁ బట్టఁగరాని రోషము
త్యాతతరీతి గుబ్బటిల నాస్యముఁ జూడఁగనైన రోసి నా
నూతనమైనరూపము గనుంగొని నిర్ఝరగర్భమందు సం
ప్రీతిగ లీనమైతి, నిదిమేలె యగుంగద నన్నుబోఁటికిఁ!

పగ దలపక నాకష్టపాటు గాంచి
సవతి యైనను పృథ్వినాసరసఁ జేరి
యార్తి యొకకొంత శమియింప ననునయించి
న్నుఁ దనయుఁట నిలిపెను గొన్నినాళ్ళు!

అచ్చటఁ బచ్చపూమొలక లట్టులవి పసుపు పైరుచేలయం
దిచ్చక వచ్చినట్లు చరియించి యన తిరి మాటకాల్వలం
జొచ్చి కొలంకులం గలువజొంపలు పుష్పాదికాన్కలీయఁగన్
హెచ్చిన సంతసంబున గ్రీవాంగి గజాలయ మేఁగకోఁటకన్

బలిసి, కూలంకషంబుగఁ బఱునదులఁ
గలసి స్వస్థాన మేఁగితిఁ గాంతుఁ డీఅ
దేనికై మూఁగు నీఁగు తెండెమటులఁ
బిల్ల లెల్లరు ననుగూడి ప్రియమునిడి

కాంతు నపేక్షచే నయిన కష్టము బిడ్డల ముద్దు ముచ్చటం
గొంత శమింపఁజేయు చాల కొన్నిదినంబులు పుచ్చనొక్కనాఁ
డెంతో మనోహరాకృతి వహించి సరోజహిమాంశుఁడు రాఁగ నా
స్వాంతమిఁ కేమి సెప్ప రెపలాడెను బూర్వము విస్మృతంబుగాన్

ఎట్టులొ తెచ్చికొన్న బిగువుపోక యింతయు సళ్ళనిక లో
నట్టిటు వీఁగుచిత్తము రవ తయిన స్వాలిదోఁషనీక యీ
స్పృష్టిపడన్ మొగంబుపయి నల్లమునూపన జకిగొఁకి నా
తట్టుకువచి సోమన కతర్కితరీతిగఁ గౌఁగిలించినన్

## జలదాంగన

ఏమిది? యున్నయంత తడవేమియు లేదుపగూహనంబునన్
గోమలి బాష్పరూపనయి కూడనయేఁ? నభోంతరంబునన్
శ్యామల కోమలాంబుదమునై చరియించుచున్నదాన నిం
కేమన నేమిలాభము? కవీశ్వర, యామెను బోయె నింతకున్

ఇంతకైనను సద్గుణవంతుఁ డగుచుఁ
గాఁపుర మగడు సేయుక గడపకున్న
నింక నీమోసముల నెవ్వరెఱిఁగివత్తు
రంతకూలికి విషమాను కాంత యెవతె?

అని వచియించుచుండునెడ నల్లనఁ జల్లనిగాలి వీవ నా
వనద లతాంగియు న్మనుఁగుపయ్యెద వే సవరించుకొంచు న
న్గని కవిశేఖరా, నిను వకాండము వీడి చనంగఁ జిత్త మొ
ప్పని యటులుండియుం జను టవశ్యకమాటకుఁ జింతగల్గెడిన్

నవురువెన్నల కమ్మదనాన నూరి
యవని యెల్ల నానందమయంబు గాఁగ
బండి యొరఁగిన మొలగొల్కు పైరుచేల
కడకు రమ్ము పరస్పరేక్షణము గలుగ,

అను చలువోకనేఁగు జలదాంగనఁ జూపులకందు మేరకుం గనిగని, బాష్పపూరములు కన్నులఁ గాఱుచునుండ చిత్తమోహన శిశి రాంశుబింబము వియత్తలమందు రహించియున్ దెసల్గనఁబడవౌర! యాత్మవికలత్వము కన్నులఁ గప్పివుచ్చుటన్

ఒలసెడు పిల్ల తెమ్మెరల యూర్పుల నీకలు మేన రేఁగఁగం బులుఁగులు గూళులన్నిదుర బోవుచు, నెండినయాకుజొంపముల్ గలగలలాడ మేలుకని గమ్మఁగనార్చెడు నల్కుఁడొక్కఁడే చెలఁగెడి తోడుగా గృహముఁ జేరి శయించితి వేగుజామునన్.

చల్లవెన్నెల, వలిమల, జలదకాంత
మంచుతుప్పలు, సెలయేళు, లంచబారు,
లిందు శేఖరతాండవ మేమొ యేమొ
కలను గాంచుచు నిదుర మేల్కాంటి నపుడె!

సంపూర్ణము.

